# కన్యక మ్మ నివాళి

కర్త్రుప్రపూర్ణ

డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# కన్యకమ్మ నివాళి

కవయిత్రి: డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

---

ప్రథమ ముద్రణ:

జూలై 1978

మూల్యము:

5-00

ముద్రణ:

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమండ్రి

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖవారి యొక్కయు,

వైశ్యప్రముఖుల సమ్మానసంఘము చీరాలవారి యొక్కయు,

అమూల్య సాహాయ్యమునకు

ధన్యవాదములు

జగన్మాత

శ్రీ

వాసవీకన్యకా

పరమేశ్వరికి

భక్తితో

అంకితము

# వేదనతోడి నివేదన

జగన్మాత శ్రీవాసవీ కన్యాకాపరమేశ్వరి అనన్యసాధ్యమైన త్యాగ మహిమతో లోకజీవితానికి తిలకము దిద్దిన పూతచరిత.

సంఘజీవితమెప్పుడూ కలుషపంకిలము కాని సుధావాహినిసాగాగి ప్రజల హృదయకమలాలలో విశుద్ధానురాగారుణిమకాంతులను తళొక్క త్తింప జేయవలె ననేదే సృష్టిరహస్యం !

'బ్రహ్మణోనామసత్యం', 'ఆకాశఇతి బ్రహ్మణోనామ' అనీ అభివర్ణింపబడి, "నసేతుర్విదధే లోకానా మసంభేదాయ" అనే ఉపని షన్మంత్రంతో "లోకముల అసంభేద స్థితికొఱకు సేతుస్వరూపియై సత్తామాత్రస్వరూపముతో, నిత్యసత్యస్వరూపముతో వెల్గొందు పర మాత్మని ప్రియమిత్యుపాసీత" అని నిర్దేశించి, వేదమంత్రము లోకా లోకములలో నిండియున్న జనజీవన పరంపరలో ప్రేమతత్త్వోపాసన యందలి పరమార్థాన్ని ఆత్మశ్రుతి కుపబలకమైన, పరమోపాదేయమైన అవశ్యంభావియైనవిధిగా ప్రకాశింపజేస్తూంది. నిత్యవిరాజమానుడైన, రాజరాజేశ్వరుని ప్రేమరూపమే జగన్మాతృ భావనకు ప్రాణప్రతిష్ఠ !

అట్టి జగన్మాత యొక్కతెయే ఈనాటి నానావిధమైన, స్వార్థ ప్రేరితమైన భోగలాలసమైన సకల దుష్కర్మపరాయణత్వమునకు, ఉపసంహారశ్రుతి పలుకగల్గిన చదురాలు.

ఆమహాదేవియే దుర్మార్గుల దుశ్చర్యలను నివారించుటకు తన బిడ్డలను నయముననో, భయముననో, లాలించియో, పాలించియో అవి రామమగు ఈనాటి అనూహ్యము, అతియేహ్యమూ, భీతావహము, చింతావహమూ అయిన దుష్టకార్యకలాపమునకు ఉచ్చాటనము సలుపగల్గిన మహాశక్తి !

జగన్మాత

శ్రీ

వాసవీకన్యకా

పరమేశికి

భక్తితో

అంకితము

# వేదనతోడి నివేదన

జగన్మాత శ్రీవాసవీ కన్యాకాపరమేశ్వరి అనన్యసాధ్యమైన త్యాగ మహిమతో లోకజీవితానికి తిలకము దిద్దిన పూతచరిత.

సంఘజీవితమెప్పుడూ కలుషపంకిలము కాని సుధావాహినిసాగాగి ప్రజల హృదయకమలాలలో విశుద్ధానురాగారుణిమకాంతులను తళ్కొత్తింప జేయవలె ననేదే సృష్టిరహస్యం!

'బ్రహ్మణోనామసత్యం', 'ఆకాశఇతి బ్రహ్మణోనామ' అనీ అభివర్ణింపబడి, "ససేతుర్విదధే లోకానా మసంభేదాయ" అనే ఉపనిషన్మంత్రంతో "లోకముల అసంభేద స్థితికొఱకు సేతుస్వరూపియై సత్తామాత్రస్వరూపముతో, నిత్యసత్యస్వరూపముతో వెల్గొందు పరమాత్మని ప్రియమిత్యుపాసీత" అని నిర్దేశించి, వేదమంత్రము లోకాలోకములలో నిండియున్న జనజీవన పరంపరలో ప్రేమతత్త్వోపాసన యందలి పరమార్థాన్ని ఆత్మశ్రుతి కుపబలకమైన, పరమోపాదేయమైన అవశ్యంభావియైనవిధిగా ప్రకాశింపజేస్తూంది. నిత్యవిరాజమానుడైన, రాజరాజేశ్వరుని ప్రేమరూపమె జగన్మాతృ భావనకు ప్రాణప్రతిష్ఠ!

అట్టి జగన్మాత యొక్కటెయే ఈనాటి నానావిధమైన, స్వార్థప్రేరితమైన భోగలాలసమైన సకల దుష్కర్మపరాయణత్వమునకు, ఉపసంహారశ్రుతి పలుకగల్గిన చదురాలు.

ఆమహాదేవియే దుర్మార్గుల దుశ్చర్యలను నివారించుటకు తన బిడ్డలను నయముననో, భయముననో, లాలించియో, పాలించియో అవిరామమగు ఈనాటి అనూహ్యము, అతియేహ్యమూ, భీతావహము, చింతావహమూ అయిన దుష్టకార్యకలాపమునకు ఉచ్చాటనము సలుపగల్గిన మహాశక్తి!

మహాసత్త్వారాధ్యులైన, మహిమోపేతురాలైన పరాశక్తి జగన్మాత శ్రీవాసవీదేవి సన్నిధిని మొఱయిడినచో ఆమె ఆమొఱలాలించి దుష్కర్మముల ఖండించి జగతిని కల్యాణము పండింపగలదని దృఢముగ విశ్వసించి యాకన్యకాంబకు నివాళులర్పించుచు ఈచిన్నికృతిని ఆమె పదనీరేజములకడ పూజాప్రసూనముగా నివేదించుకొనుచున్నాను.

ఈకృతి రచన విషయమై మఱియొక్కమాట!

నేను రచించిన శ్రీ కన్యకాపరమేశ్వరీ సుప్రభాత ప్రచారార్థమై రాయలసీమ కాహ్వానింపబడి నేనచట పర్యట మొనర్చుచున్నతరి శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రిగారు రాయలసీమలో ప్రచారములోనున్న 'కూనలమ్మ పదముల' ను నాకు చదివి వినిపించిరి. ఆసమయంలో ఆ ఛందము, నన్ను మిక్కిలి ఆకర్షించి అట్టిపదరచన చేయుటకై నన్ను ప్రోత్సహించినది. అదిమొదలు దేశమునందే సంఘటన జరిగినను దానిని గూర్చి ఈపదములయందే రచన సాగించితిని. తరువాత శ్రీ ఆరుద్రగారు "కూనలమ్మపదములు" అను మకుటముతోనే ఒక కృతిని ప్రచురించియుండిరి. అంతవారికి ఈకృతిని ప్రచురింపవలెనని ఉత్సాహపడినను ఎందుకో కొంత నిరుత్సాహము కల్గి ప్రచురణను నాపివైచితిని. కాని తర్వాత శ్రీ బోయి భీమన్నగారు తమ పిల్లీశతకమును ప్రచురించియుండిరి. అదిచూచి మఱల ఈకృతిని ప్రచురింప సంకల్పించితిని. అది ఇన్నాళ్ళకీ రూపమున నీడేరినది.

కళాప్రపూర్ణ

డా. ఊ. లక్ష్మీకాన్తమ్మ

శ్రీరస్తు

# కన్యకమ్మ నివాళి

నాతిశీలమె జగతి
జాతికిచ్చును ప్రగతి
చాటిచెప్పితి సుగతి
ఓ కన్యకమ్మా.

మానహీనపుబ్రతుకు
బ్రతుకుటే ఒక కొదుకు
అగ్గి దూకితి తుదకు
ఓ కన్యకమ్మా

ఇరువదేడులు వచ్చె
ఇంత కటకట హెచ్చె
స్వాతంత్ర్య మొక బొచ్చె
ఓ కన్యకమ్మా.

బాపు బంగరుకలలు
భాగ్యపున్ మిలమిలలు
వేసెనె నెత్తుటలలు
ఓ కన్యకమ్మా.

అమ్మా మాదు గోడు
ఆలకించేవాడు
లేడుగదమ్మ నేడు
ఓ కన్యకమ్మా.

మంత్రి లంచము నీతి
మారణాస్త్రము ఖ్యాతి
సామాన్యుడే కోతి
ఓ కన్యకమ్మా.

చుక్కలంటే ధరలు
బక్కవాడికి ఉరులు
లంచగొండికి సిరులు
ఓ కన్యకమ్మా.

ధరల కంట్రోలింగు
సరకుల రేషనింగు
అధికార్కి ఫెచ్చింగు
ఓ కన్యకమ్మా.

రేషనిమ్మని కార్డు
హూష్ష లేదని బోర్డు
జీవితమ్మే హార్డు
ఓ కన్యకమ్మా.

మంత్రియంటే యముడు
మంత్రాంగమే జముడు
భరతఖండమె అస్తాగు
ఓ కన్యకమ్మా.

మెండు పండిన భూమి
తిండిగింజలు లేమి
కేమి హేతువా, స్వామి
ఓ కన్యకమ్మా.

క్యూలే గతియేమైనా
కాలే కడుపులకైనా
పాలా పావలకైనా
ఓ కన్యకమ్మా.

ప్రజలరక్తము పిండి
పన్ను హెచ్చుగ దండి
ప్రభుత నెలవుట మొంది
ఓ కన్యకమ్మా.

ప్రేమలేఖలకైనా
పెండ్లిలేఖలకైనా
పేదనోచదు రాజ్యాన
ఓ కన్యకమ్మా.

మంత్రి రౌడీకి రక్ష
మంత్రికి రౌడీ రక్ష
పెదవి చేటురా కక్ష
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మ నివాళి

పన్నులా పీక్లాను
వసతిలా లోక్లాను
అంచమా హైక్లాను
ఓ కన్యకమ్మా.

తైట్లులేనిరైళ్ళు
రాత్రులన్ దోపిళ్ళు
తెరచునె ప్రభుతకళ్ళు
ఓ కన్యకమ్మా.

ఆకలంటూ రోదలు
అర్జీలకే చెదలు
అలమటించే యెదలు
ఓ కన్యకమ్మా.

విలువ తగ్గిన రూప్యము
విధము చెలరేగె జాప్యము
బైటపెట్టెను గోప్యము
ఓ కన్యకమ్మా.

కోట్లు కోట్లుగ అప్పు
కోరి తెచ్చుట తప్పు
ముంచు కొచ్చెను ముప్పు
ఓ కన్యకమ్మా.

మంత్రి ఖర్చులపొమ్మ
మనుజలోకము నమ్మ
ప్రజలనోటను దుమ్ము
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మనివా ?

ప్రజలరక్తము పిండి
పన్నుదండిగ దండి
ప్రభులు తిందురు తిండి
ఓ కన్యకమ్మా.

విద్దెవెలుగని ఘనులు
గద్దెనెక్కారి నరులు
మూటకట్టిరి సిరులు
ఓ కన్యకమ్మా.

బలము పాలిది రాజ్యము
మంచికంతా పూజ్యము
గెల్చునే నీవ్యాజ్యము
ఓ కన్యకమ్మా.

ఆప్తులకు సదో్యగము
ఆశ్రితుల కుదో్యగము
అర్హులకె దురో్యగము
ఓ కన్యకమ్మా.

తనకు పదవికోసము
తాను అత్యున్నదేశము
మంత్రిబుద్ధి మోనము
ఓ కన్యకమ్మా.

పంచదారకు కరువు
పట్టెడన్నము కరువు
బ్రదుకుటే ఒకబరువు
ఓ కన్యకమ్మా.

చదువు పద్దుకు కోత
సంస్కృతికి పెనువాత
ప్రభుత ఈగల మోత
ఓ కన్యకమ్మా.

పుట్టిచచ్చిన పన్ను
చచ్చిపుట్టిన పన్ను
లేదు మాకిక ధన్ను
ఓ కన్యకమ్మా.

అవినీతి ద్రవ్యార్జన
అక్రమ లాభార్జన
పెద్దమ్మ కారాధన
ఓ కన్యకమ్మా.

దేశము పేరిట అప్పు
పెద్దల గంటికి ఉప్పు
ఎందఱ కళ్ళను కప్పు
ఓ కన్యకమ్మా.

మాటలె, మఱి ఎలెక్షన్
మంచిమాట కలక్షన్
మత్తులకే సెలక్షన్
ఓ కన్యకమ్మా.

మిస్లేనియస్ పద్దు
మింగువారికి ముద్దు
లేదె దీనికి హద్దు
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మ నివాళి

ఇంటింటికి సమ్మె
వీధివీధికి సమ్మె
విశ్వమంతా సమ్మె
ఓ కన్యకమ్మా.

డబ్బులిస్తే ఓటు
డబ్బులిస్తే సీటు
డబ్బుకేమిటి లోటు
ఓ కన్యకమ్మా.

సమ్మె, ఘెరావ్ బందు
పోటి వారల ముందు
తల వంపులను పొందు
ఓ కన్యకమ్మా.

ముడుపులేనీ పిటిషను
మాటలేని ఎలెక్షను
మూగబ్రతుకుల ఫిక్షను
ఓ కన్యకమ్మా.

ఇజము ఇజములు పెరిగె
ఇలను రణములు పెరిగె
మానవత్వము విరిగె
ఓ కన్యకమ్మా.

మనిసు మనిషికి హాజము
మంది మందికి ఇజము
నీ సేవయే నిజము
ఓ కన్యకమ్మా.

రంగు ఫిరాయించీ
హంగుదబాయించీ
బ్రతుకుటిపుడు మంచీ
ఓ కన్యకమ్మా.

డబ్బుగుంజుట తప్పు
డప్పుకొట్టుట తప్పు
ఏమికలదిక గొప్ప
ఓ కన్యకమ్మా.

మనసు మనసుకు మధ్య
కనిపించదు సయోధ్య
శాంతి పల్కుట మిధ్య
ఓ కన్యకమ్మా.

తగవుచెప్పుట ఘోష
ధర్మమఅయుట శోష
పగు నొంచుటె భూష
ఓ కన్యకమ్మా.

వేనవేలుగ బండ్లు
వేంకటేశుని గుండ్లు
మనసునిండా ముండ్లు
ఓ కన్యకమ్మా.

రాజ్యమేలుటకన్న
రమణి నేలుటకన్న
మనసు నేలుట మిన్న
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మ నివాళి

వేదులెక్కెను శాంతి
వాదములలో క్రాంతి
జీవితమే అశాంతి
ఓ కన్యకమా

చదువులో ప్రమాణము
సంస్కృతి విజ్ఞానము
తగ్గుటె అవమానము
ఓ కన్యకమ్మా.

బడికి ఒకటే సలాం
పంతులకును రాంరాం
ఫస్క్లాసులు తాంతాం
ఓ కన్యకమ్మా.

చదువులెందుకు భాయి
బ్రదుకు సూత్రమె హాయి
గురువు బుఱ్ఱ సఫాయె
ఓ కన్యకమ్మా.

మానవత్వము కోసము
మనిషి పెంచును మోసము
మాట మాటకె రోసము
ఓ కన్యకమ్మా.

సీట్లకోసం కుస్తీ
ఓట్లకోసం గస్తీ
సేవకైతే సుస్తీ
ఓ కన్యకమ్మా.

సమ్మె చేసే జనత
సందిగ్ధమైన ప్రభుత
చచ్చె దేశపు ఘనత
ఓ కన్యకమ్మా.

హక్కులకు పోరాటము
పదవులకు ఆరాటము
ప్రజలకే ఇరకాటము
ఓ కన్యకమ్మా.

ఇపుడు జీతపు సమ్మె
అపుడు బత్తెపు సమ్మె
ఇది పార్టీల బొమ్మె
ఓ కన్యకమ్మా.

నీకు సొమ్ము పోనీ
వాకె సొమ్ము రానీ
కమ్యూనిష్టు బాణీ
ఓ కన్యకమ్మా.

తిండిచాలక శోష
దాఁకోసం ఘోష
ఎందుకు కంఠశోష
ఓ కన్యకమ్మా.

నూపరెరువుల బలపులు
సుందరాంగుల వలపులు
కుళ్ళుకంపుల తలపులు
ఓ కన్యకమ్మా.

న్య క మ్మ ని వా !

మంచికావ్యము వ్రాసి
మంచికార్యముచేసి
వెంటనొందుము గాని
ఓ కన్యకమ్మా.

పద్యకవితలు బూజు
పదకవిత్వమె మోజు
కథలువ్రాస్తే ప్రైజు
ఓ కన్యకమ్మా.

ప్రేమయన్నది సత్యము
కామమన్నది పైత్యము
తెలిసికొనుమె ఆగత్యము
ఓ కన్యకమ్మా.

మగడు వండిన వంట
మగువ ఎంచుట తంట
ఇల్లుపీనుగ పెంట
ఓ కన్యకమ్మా.

కంఠకావర మెత్తి
కన్యపై మదిహత్తి
ప్రభుడె పొందెను మిత్తి
ఓ కన్యకమ్మా.

పార్టీ ఒంచును ప్రభుత
పార్టీ నొంచును ప్రభుత
ఒంతురు పేదల అరుత
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మ నివాళి

పెండ్లిమెడ కొకరోలు
బిడ్డలకు కంట్రోలు
బాటుబ్రతుకులు మేలు
ఓ కన్యకమ్మా.

మద్యమానుటె ఘనత
మగువ నుంచుటె నవత
పెక్కువ్రాయుటె కవిత
ఓ కన్యకమ్మా.

కథలు వ్రాయగవచ్చు
కవిత చెప్పగవచ్చు
పిటిపెంచుట హెచ్చు
ఓ కన్యకమ్మా.

నగ్నసుందరి తోడ
నాట్యమాడును గోడ
నగుబాటులే వాడ
ఓ కన్యకమ్మా.

రమణికేడ్పివవాడు
కాముడదేమిటి ఘనుడూ
రమణులెందరో చూడు
ఓ కన్యకమ్మా.

కావ్యబహుమతికోరి
కామలేఖలు గిరి
నడచు హద్దులు మీరి
ఓ కన్యకమ్మా.

క న్య క మ్మ ని వా ళి

వాగారునసాగరము
నవసస్యశ్రీకరము
భరతలక్ష్మి కాకరము
ఓ కన్యకమ్మా.

బలము గల్గినచాలు
పదవి గల్గిన మేలు
పదమినే వాదేలు
ఓ కన్యకమ్మా.

కోర్కె తీరినకొద్ది
కొనలు సాగును బుద్ధి
కోర్కె తుంచుట సుద్ధి
ఓ కన్యకమ్మా.

మనకు కల్గిన కొద్ది
మసలుకొనుటే బుద్ధి
మించి నడచుటె రద్ది
ఓ కన్యకమ్మా.

వేమనయోగి మాటలు
వేదమే వ్యాసపదాలు
మానవత్వపు గుడులు
ఓ కన్యకమ్మా.

పదిలమౌ సత్యమ్ము
పరమేశు నృత్యమ్ము
తెలియవలె నిత్యమ్ము
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మనివాళి

దైవభీతియె లేని
ధర్మచింతయె లేని
మనిషి బ్రదుకుటె హాని
ఓ కన్యకమ్మా.

కామకోటి స్వామి
కర్మధర్మభూమి
ముక్తి కిచ్చును హామి
ఓ కన్యకమ్మా.

వరుని నమ్మటకన్న
నమ్మట కుక్కను మిన్న
కుక్క వదలదు రన్న
ఓ కన్యకమ్మా.

కవిత సోయగ మరపి
గంగకావ్యము వ్రాసి
పెంచెను యశోరాశి
ఓ కన్యకమ్మా.

మాట చెఱచు మమతలు
పాలుపడని మనుజులు
తీరవు ఈకలతలు
ఓ కన్యకమ్మా.

సభ్యతలేని దేశము
సంస్కృతిలేని మీాపము
మానవతకే మోసము
ఓ కన్యకమ్మా.

శుద్ధ భక్తి బాటుగా
సల్పు సేగి నీటుగా
బుద్ధిచెప్పు ఘాటుగా
ఓ కన్యకమ్మా.

శివసేన, హరిసేన
శివశివా హైరాన
లూటికి హరిపేరేన ?
ఓ కన్యకమ్మా.

దేవుడాయువుపోస్తే
రైళ్ళు ఆయువుతీస్తే
యమునకే సెలవిస్తే
ఓ కన్యకమ్మా.

కన్యకమ్మ నివా?

వన్నెపార్యుని ఫణితి
ఆద్యభాషా ప్రథితి
ఆంధ్రకావ్య దీధితి
ఓ కన్యకమ్మా.

తిక్కయజ్వ మృదులోక్తి
తెలుగుబాస మధురోక్తి
కవితా పతీ నదుక్తి
ఓ కన్యకమ్మా.

త్యాగరాయువిపాట
త్యాగభక్తులయూట
అమృతత్వంపు తేట
ఓ కన్యకమ్మా.

పోతనకవి కావ్యము
పుష్పమధుర ధుర్యము
భారతికాహార్యము
ఓ కన్యకమ్మా.

తల్లి హృదిని బాకులు
ధర్మమునకు మేకులు
తెలంగాణా షోకులు
ఓ కన్యకమ్మా

రాముని ధర్మనిరతి
గాంధీ త్యాగనియతి
కాచునెప్పుడు జగతి
ఓ కన్యకమ్మా.

అతడె భారతనేత
అతడె భాగ్యవిధాత
అతడె గాంధీతాత
ఓ కన్యకమ్మా.

భరతజాతి నిర్మాత
అతడె భాగ్యనిర్ణేత
అతడె గాంధీతాత
ఓ కన్యకమ్మా.

అంటరాని తనమును
అపనయింప నతడును
సలిపె నుపవాస వ్రతమును
ఓ కన్యకమ్మా.

మాతృభూమి దాస్యము
మాపుటే యవశ్యము
గాంధిజనిర్థహాస్యము
ఓ కన్యకమ్మా.

పిల్లిమీంగను శతకం
నేలుకవితా పథకం
భీమకవితకు వెల్కం
ఓ కన్యకమ్మా.

వచ్చిన స్వాతంత్ర్యము
ఇచ్చెను దారిద్ర్యము
చెఱచె నైకమత్యము
ఓ కన్యకమ్మా.

సేవచేసెడువాడు
చెవగల్గినవాడు
ప్రభుత ఒల్లనివాడు
ఓ కన్యకమ్మా.

చేతులెత్తేవాడు
చేతకానివాడు
ప్రభుతమెచ్చేవాడు
ఓ కన్యకమ్మా.

పార్టీకక్ష పెంచి
పదవికనర్హునెంచి
పట్టముకట్టిమించి
ఓ కన్యకమ్మా.

ప్రాగుతాడు హమేషా
వాగుతాడు తమాషా
వాడేను షాహంషా
ఓ కన్యకమ్మా.

శాంతిరూపము గాంధి
సత్యాహింసలు గాంధి
మాతృసేవయెగాంధి
ఓ కన్యకమ్మా.

భరతజనుల త్యాగము
భక్తజనవిరాగము
గాంధి కర్మయోగము
ఓ కన్యకమ్మా.

క న్య క మ్మ ని వా ళి

ఇది లోకపు వాకీ
ఇది వైకుంఠపాళి
నీకిత్తును నివాళి
ఓ కన్యకమ్మా.

---

సరస్వతి భవన్ ప్రెస్-రాజమండ్రి